
షికారుకి
వెళ్లిన ఒంటె

అడవిలో చీకటిగా ఉంది, అంతా ప్రశాంతంగా ఉంది. ఒక్క ప్రాణి కూడా కదలటం, మెదలటం లేదు. గాలి కూడా ఆడటం లేదు. ఒక్క ఆకు కూడా రాలటం లేదు, గడ్డిపరక కదలటం లేదు.

ఇలా ఎందుకు ఉందో తెలుసా? అది రాత్రికీ, పగటికీ మధ్య సంధ్యా సమయం. చీకటి ముగిసి, వెలుతురు అలుముకుంటోంది.

అడవిలో రాత్రి చాలా చీకటిగా ఉంటుంది,
సమయం చాలా నిదానంగా గడుస్తుంది.

ఈ కథ మొదలయ్యే సమయానికి అడవిలో
ఇంకా చీకటిగానే ఉంది. బాగా వేడిగా కూడా ఉంది.

జంతువులన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. కానీ,
అన్నిటికంటే పులి చాలా శాంతంగా ఉంది.

అడవి మధ్యలో నుండి వెళ్లే దారి పక్కన ఒక
చెట్టు కింద పులి పడుకుని ఉంది. ఆకులు, పూలు,
కొమ్మలు, గడ్డి మధ్య పులిని గుర్తించటం కష్టం. చీకటి
వల్ల కూడా పులి కనపడదు.





ఉన్నట్టుండి ఆకాశంలో తొలి కాంతి కిరణాలు ప్రసరించాయి. ఆకాశం, అడవి, చివరికి గాలి కూడా కాంతివంతం అవుతున్నాయి.

అడవిని రెండుగా చీలుస్తున్న దారిలో దూరంగా నింగీ, నేలా కలిసే చోట ఆ సమయంలో ఎవరో వస్తున్నారు.

పులి నిద్రపోతూ ఉందని అనిపిస్తుంది. కానీ, మీరు దాని ముఖం చూడగలిగితే, ఆ వస్తున్న వైపు ఉన్న కన్ను కొద్దిగా తెరుచుకోవటం, చాలా కొంచెం తెరుచుకోవటం మీకు కనిపిస్తుంది.

ఏదైనా ఒక పులి కన్ను చాలా కొద్దిగా తెరుచుకుంది అంటే మీరు అనుకున్నట్టు అది నిద్రపోవటం లేదని అర్థం.

అది చూస్తూ, ఆలోచిస్తూ ఉంది.

పులి గమనిస్తూ ఉన్న దూరాన ఉన్నది మెల్లగా దగ్గరకి వస్తోంది. ఆకాశం మెల్ల మెల్లగా కాంతివంతం అవుతోంది. దారిలో కూడా వెలుతురు పెరుగుతుండటంతో ఆ వస్తున్నది ఎవరో మీరు చూడవచ్చు...

మీకు ఆశ్చర్యం వేస్తుంది!



అది చాలా అందమైన ఒంటె.

లేత గచ్చకాయ రంగు కళ్లు ఉన్న ఆ అందమైన ఒంటె ఉదయం నడకకి బయలుదేరింది. తల పైకి ఎత్తి మెల్లగా, చాలా మెల్లగా, ఎంతో అందంగా అది నడుస్తూ వస్తోంది. తెల్లవారి గాలి వాసనలను అది ఆనందిస్తోంది. ఆకాసంలో అలుముకుంటున్న అరుణిమను అది చూస్తూ ఉంది.

చెట్టు కింద ఉన్న పులి ఆలోచనలు పరుగులు పెడుతున్నాయి. "ఆ చెట్టు నీడ మొదలయ్యే చోటుకి ఒంటె చేరుకోగానే నేను దాని మీదకి ఎగిరి దూకుతాను!"



ఆ దారిలో మెల్లగా వస్తున్న ఒంటెను పులి ఒక్కటే చూడటం లేదు.

పులి పడుకుని ఉన్న చెట్టు పైకొమ్మ మీద ఒక కోతి కూర్చుని ఉంది! పులి ఏమి ఆలోచిస్తోందో దానికి తెలుసు! అందుకే అది ఏమాత్రం శబ్దం చెయ్యకుండా ఒక కొబ్బరికాయ కోసి పట్టుకుంది. “ఒంటె మీదకు పులి దూకబోయే సమయంలో దాని నెత్తిన ఈ కొబ్బరికాయ వేస్తాను!” అని కోతి తనలో తాను అనుకుంది.





ఈలోగా దారిలో ఒంటె ఎంతో అందంగా నడుస్తూ వస్తోంది. నడుస్తూ, నడుస్తూ అది ఒకసారి ఎడమవైపుకి, ఒకసారి కుడివైపుకి చూస్తోంది.  ఆకాశం మెల్ల మెల్లగా కాంతివంతం అవుతోంది.

కానీ, ఆ అందమైన ఒంటెను పులి, కోతి మాత్రమే చూడటం లేదు.

అదే చెట్టు మీద ఒక చిన్న ఉడత ఉంది. అది తన అందమైన చిన్న కళ్లతో అంతా చూస్తోంది. అది చప్పుడు చెయ్యకుండా కోతి తోక దగ్గరకు వచ్చి కూర్చుంది. "పులి మీదకి కొబ్బరికాయను కోతి వెయ్యబోతుండగా దాని తోకను కొరుకుతాను!" అని ఉడత అనుకుంది.





ఈలోగా ఒంటె ఎంతో హుందాగా
నడుస్తూ ముందుకు వస్తోంది. అది
నడుస్తూ, నడుస్తూ ఒకసారి ఎడమవైపుకి,
ఒకసారి కుడివైపుకి చూస్తూ ఉంది.
ఆకాశంలో వెలుతురు పెరుగుతూ ఉంది.

అయితే ఆ అందమైన ఒంటెను పులి, కోతి, ఉడత మాత్రమే చూడటం లేదు.

పులి, కోతి, ఉడత ఏమి ఆలోచిస్తున్నాయో ఒక కొమ్ము పక్షి చూస్తూ ఉంది. "ఓహో! నాకు ఏం చెయ్యాలో తెలుసు. కోతి తోకను ఉడత కొరకబోయేటంతలో దాని తల మీద నా పదునైన ముక్కుతో పొడుస్తాను," అని అది తనలో తాను అనుకుంది.

పులిలో ఉద్రేకం పెరిగిపోయి అది తన తోకను కదిలించకుండా ఉండలేకపోతోంది. దాని తోక ఆ వైపునుంచి ఈ వైపుకి ఆడుతోంది.





ఈ లోగా ఒంటె దగ్గరకి వస్తోంది, ఇంకా దగ్గరకి వస్తోంది. సూర్యుడు పైకి, ఇంకా పైకి వస్తున్నాడు. ఒంటెకి వేడిగా, ఇంకా వేడిగా అనిపిస్తోంది. అది చెట్టు నీడను చేరుకోబోతోంది. పులి, కోతి అన్నీ సిద్ధంగా ఉన్నాయి. అంతలో...



ఆ అందమైన ఒంటె ఉన్నట్టుండి ఆగిపోయింది. దాని అందమైన మెడను పైకి ఎత్తింది. నోరు బాగా తెరిచి, పెద్దగా ఆవలించింది. “ఇక వెనక్కి వెళతాను,” అని తన చక్కనైన గొంతులో పలికింది.



పులి ఒక్కసారిగా ఆశ్చర్యానికి లోనయ్యింది. దానికి ఏం చెయ్యాలో తెలియలేదు. ఒంటె మీద దూకాల్సిన సమయంలో అది-

ఒంటె మీదకి దూకలేదు.

కోతి కొబ్బరికాయ వెయ్యలేదు.

కోతి తోకను ఉడత కొరకలేదు.

ఉడత నెత్తి మీద కొమ్ము పక్షి పొడవ లేదు.

తాము అనుకున్నది ఏదీ అవి ఆ క్షణంలో చెయ్యలేకపొయ్యాయి.

క్షణంపాటు ఏదీ ఏమీ చెయ్యకపోవటంతో అంతా నిశ్శబ్దంగా ఉంది.

చివరికి కొమ్ము పక్షి పెద్దగా నవ్వింది. దాని నవ్వు అడవి అంతా వినిపించింది.

ఉడత పెద్దగా అరవటం మొదలుపెట్టింది. సంతోషంతో కోతి ఎగిరి దూకుతోంది. దాంతో అడవిలోని జంతువులన్నీ లేచి, “ఏం జరిగింది? ఏం జరిగింది?” అని అడగసాగాయి.







ఏం జరిగిందో మీ అందరికీ తెలుసు. ఏమీ జరగలేదు! అందమైన ఒంటె వెనక్కి తిరిగి, వచ్చిన దారిలో వెళ్లసాగింది. ఏం చెయ్యాలో తెలియని పులి చప్పుడు చెయ్యకుండా అడవి లోపలికి వెళ్లి పోయింది. ఆకాశంలో సూర్యుడు వెలుగులు చిమ్ముతున్నాడు.

అయిపోయింది.